# కాశ్మీర్ మధ్యవర్తి డాక్టరు ఫ్రాంక్ గ్రాహాంకు
# ఇండియా ముస్లిం ప్రముఖుల నివేదన

భద్రతా సంఘం, దాని వివిధ శాఖలు కాశ్మీర్ సమస్యను పరిశీలింపడానికి ఎంతో అమూల్యమైన కాలాన్ని వినియోగించాయి. ఆ సమస్యా పరిష్కారానికి ఎన్నో సూచనలను చేశాయి. కాని, వాటిలో ఒక్కరూ కూడా ఈ విషయంలో ఇండియా ముస్లింల ఉద్దేశమేమిటో కనుక్కోడానికి ప్రయత్నించలేదు. తొందర పడి కాశ్మీర్ విషయంలో ఎట్టి చర్య తీసుకున్నా, అదెంత మంచి ఉద్దేశంతో తీసుకున్న చర్య అయినప్పటికీ, దానివల్ల ఇండియా ముస్లింలకు ఎట్టి ఇబ్బందులు కలుగుతాయో తెలుసుకుందామనే ఆలోచన భద్రతాసంఘ కార్య కర్తలలో ఏ యొక్కరికీ కలగకపోవడం చాలా విచిత్రం.

భారతీయ సమాజంలో ముస్లింల స్థానమెట్టిదో, పరిస్థితులెట్టివో స్పష్టంగా అర్థం చేసుకుంటే గాని కాశ్మీర్‌లో స్థిరమైన పరిష్కారాన్ని సాధించడం సాధ్యం కాదని మేము గాఢంగా విశ్వసిస్తున్నాము.

ఈ (ఉపఖండం) భారతదేశం విభజించ బడక పూర్వం పాకిస్తాన్ అంటే ఏమిటో, దాని స్వరూపం ఎట్టిదో స్పష్టంగా నిర్వచించడానికి

పాకిస్తాన్ సూత్రముల పురుషులు నిరాకరించారు. వారు తెచ్చి పెట్టిన ద్విజాతి సిద్ధాంత మెట్టి దుష్ఫలితాలకు దారి తీయగలదో వూహించ డానికి వారప్పుడు చేసింది శూన్యం, అందువల్ల, వాస్తవిక పరిస్థితులతో సంబంధం లేకుండానే ఆనాడు "పాకిస్తాన్" అనేది మతోద్రేకాన్ని రెచ్చగొట్టే నినాదమయింది. మెజారిటీతో కలిసి జీవించడానికి మైనారిటీకి ఇష్టం లేకపోతే, మైనారిటీతో కలిసి బ్రతకడాన్ని మెజారిటీ ఎలా సహించగలదో ముస్లిం లీగ్ నాయకులు ఆలోచించలేదు. అసలు ఆ విషయమే వారికి తట్టలేదు. అందువల్ల దేశ విభజన ముస్లింలకు విపత్కారమైందనడంలో ఆశ్చర్యమేమీ లేదు.

అవిభాజ్య భారత దేశంలో ముస్లింల సంఖ్య 10 కోట్లు. దేశ విభజన వల్లవారు మూడు భాగాలుగా చీలి పోయారు. అందులో 2½ కోట్లు పశ్చిమ పాకిస్తాన్‌లోను, 3½, 4, కోట్లు వరకు ఇండియాలోను, తక్కిన వారు తూర్పు పాకిస్తాన్‌లోను, మూడు ప్రత్యేక ప్రాంతాలకు విడదీయ బడ్డారు. ఆ విధంగా ఒకే ఒక దేశంలో ఏక సంఘంగా వుంటూ వచ్చిన ముస్లింలు మూడు దేశాలలో మూడు ముక్కలుగా చేయ బడ్డారు, ఇప్పుడు ఏ ప్రాంతంలోని—ముస్లింలకు ఆ ప్రాంతంలో ప్రత్యేక సమస్యలు ఏర్పడ్డాయి. ఎవరి దారి వారిదిగా అయిపోయింది.

పాకిస్తాన్ మత ప్రాతిపదికపై నిర్మించ బడలేదు, అలా నిర్మించ బడి వున్నట్టయితే, అప్పుడే మా సమస్య, ఇతర మైనారిటీల సమస్య కూడ పరిష్కారమైపోయి వుండేది. మత ప్రాతి పదికపై దేశం విభజించబడి వున్నట్టయితే ఇండియాలోను, పాకిస్తాన్‌లోను, మైనారిటీ మతాలవారు

విశేషంగా విడిచి పెట్టబడే వారుక్రారు. పాకిస్తాన్ అంటే ఏమిటో స్పష్టంగా నిర్వచించబడలేదని మేము పైనపేర్కొన్న దానికి ఇది ఉదాహరణ. ముస్లిం లీగ్ నాయకులకు పాకిస్తాన్ అంటే ఏమిటో నిశిష్టమైన భావం లేదని, దాని వల్లఏర్పడ గల ఫలితాలు కొన్ని దృగ్గోచరమవుతున్నా, వాటిని వారు అర్థం చేసుకోడానికి ప్రయత్నించలేదని నమ్మడానికి ఈ ఒక్క విషయమే నిదర్శనం.

దేశం విభజించ బడడంతో, ఇండియాలోని ముస్లింలను గాఢాంధకారంలో వదిలి వేసి, ముస్లిం లీగ్ నాయకులు పాకిస్తాన్‌కు లేబపోయారు. కొందరు ఇండియాలోగల తమ ఆస్తిపాస్తులను శుభంగా అమ్ముకొని మరీపోయారు. పాకిస్తాన్‌కు వెళ్ళిపోయిన వారు ఎంతో మంది బంధు మిత్రుల్ని ఇండియాలో వదిలి వేశారు. పాకిస్తాన్ నాయకులు, పాకిస్తాన్ ఇస్లాం రాజ్యం చేస్తామని ప్రకటించారు. దానితో అక్కడి మైనారిటీలకు భీతి కలిగింది. వారిలో భయాందోళనలు పుట్టుకొచ్చాయి. పాకిస్తాన్ నాయకులు అంతటితో ఆగలేదు. ఇండియా లోని ముస్లింల హక్కుల్ని కాపాడతామని పదే పదే ప్రకటించడం మొదలు పెట్టారు. దానితో ఇక్కడ హిందువులు మమ్మల్ని అనుమానించ సాగారు. ఇండియా పట్ల ఘా విధేయత, భక్తి అనుమానానికి గురి అయినాయి.

పశ్చిమ పాకిస్తాన్ నుంచి హిందువులు తరిమి కొట్టబడ్డారు. పాకిస్తాన్ అట్టి చర్యను జరిపినప్పుడు దానివల్ల ఇండియాలో ముస్లింలకు కలుగ గల కష్టాలను గురించి లేశమైనా అలోచించి వుండలేదు. ఇప్పుడు తూర్పు పాకిస్తాన్‌లో అదే విధానం అవలంబించ బడుతున్నది. అక్కడి

నుంచి లక్షల సంఖ్యలో హిందువులు ఇండియాకు తరలి వస్తున్నారు. పాకిస్తాన్‌కు హిందువులు అక్కరలేక పోతే, ఇండియాకు ముస్లింలు ఎలా పనికి వస్తారు ? పాకిస్తాన్ అవలంబిస్తున్న విధానం ఇండియాలో ముస్లింల నాశనానికే దారి తీస్తుంది. పోనీ, ఇండియా ముస్లింలు అంతా పాకిస్తాన్‌కు లేచి పోవచ్చునేమో అనుకుంటే, ఇప్పుడు ఇండియా ముస్లింలకు పాకిస్తాన్‌లో చోటు లేకుండా చెయ్య బడింది. ఈ సత్యం గత సంవత్సరమే బైట పడింది. ఇండియా ముస్లింలు పాకిస్తాన్‌కు లేచిపోతే పాకిస్తాన్ ఆర్థిక వ్యవస్థ తలక్రిందులై పోగలదు. దేశ విభజన అనంతరం, రెండు దేశాల సరిహద్దులలోను సంభవించిన కల్లోల కారణంగా కొందరు ముస్లింలు పాకిస్తాన్‌కు వలస వెళ్లారు. వారిని పాకిస్తాన్ ఆదరించలేక పోయింది. వారికి అది నరక ప్రాయమయింది. కాగా ఏదో మాతృదేశమను కొని పాకిస్తాన్‌కు వెళ్లిన ఇండియా ముస్లింలు (మియోలు) తిరిగి ఇండియాకే తిరిగి రాక తప్పింది కాదు. వారిని తిరిగి ఇండియా పునరావాసితుల్ని జేసింది.

ఇండియాలో మేము గౌరవంగా బ్రతుకు తున్నామంటే అందుకు పాకిస్తాన్ కారణం కాదు. పాకిస్తాన్ విధానాల వల్ల, ప్రకటనల వల ఇక్కడ మా గౌరవ ప్రపత్తులు కొంత తగ్గాయి. ఇక్కడ మేము సురక్షితంగా వున్నామంటే అందుకు ఇండియా నాయకత్వం కారణం. గాంధీజీ, పండిత నెహ్రూల విశాల దృక్పథం, ఉత్తమ నాయకత్వం, మత సమాన సంప్రదాయం, అన్నిటికీ మించి కులమత పక్ష విభేదాన్ని పాటించకుండా పౌరులందరికీ సమాన రక్షణావకాశాలు కలిగిస్తున్న ఇండియా రాజ్యాం

గం—ఇవన్నీ ఇండియాలో మాక్షేమానికి పునాదులు. పాకిస్తాన్ ఏర్పడక పూర్వం ముస్లిం లీగ్ వల్లా, ఆ తర్వాత పాకిస్తాన్ వల్ల—ముస్లింలు మోసగించ బడ్డారని మేము ఖచ్చితంగా చెపుతున్నాం. పాకిస్తాన్‌లోను, ఇండియాలోను ఇంత మంది హిందువులు, ముస్లింలు అనవసరమైన బాధలను పొందడానికి ముస్లిం లీగ్, పాకిస్తాన్‌లే కారణం. దేశ విభజన మొదలు మమ్మ్మ పీడిస్తున్న భయాదోళనలకు స్వస్తి జరగాలంటే పాకిస్తాన్ తన విధానాన్ని మార్చుకో వలసి వుంది. ఇక్కడ హిందువులతో కలిసి మెలిసి మేము సుఖంగా జీవించడానికి పాకిస్తాన్ దోహదం చెయ్య వలసి వుంది.

ఇక్కడ ఇండియాలో సివిల్ సర్వీసులనుంచి, సైన్యం నుంచి, పరిశ్రమలనుంచి, వ్యాపారం నుంచి, ఇతర అనేక కీలక స్థానాల నుంచి ఇండియా మమ్మల్ని గెంటి వెయ్యలేదు. ఇండియాపై పాకిస్తాన్ మాటి మాటికి అనేక సవాళ్లను విసురుతున్నప్పటికి, దుమ్మెత్తి పోస్తున్నప్పటికీ ఇండియా మమ్మల్ని ఆదరించింది. ఇండియా ప్రభత్వంలోను, రాష్ట్ర ప్రభుత్వాలలోను ముస్లింలు మంత్రులుగా వున్నారు. హైకోర్టులలోను, సుప్రీం కోర్టులలోను ముస్లింలు న్యాయ మూర్తులుగా వున్నారు. ఇండియా ప్రభుత్వానికి ప్రాతినిధ్యం వహిస్తూ విదేశాలలో రాయబారులుగావున్నారు., పెద్ద పెద్ద కీలక ఉన్నతోద్యోగాలలో, సివిల్, పోలీసు శాఖలలో ఎంతో మంది ముస్లింలు ఇండియా ప్రభుత్వాన్ని సేవిస్తూ, భారతీయుల విశ్వాసాన్ని చూరగొంటున్నారు. ఇండియాలో ముస్లింలకు ఆ స్టేట్లు వున్నాయి. విస్తారమైన వ్యాపారం వుంది. భవనాలున్నాయి, పరిశ్రమలున్నాయి. ఎగుమతి,

దిగుమతి వ్యాపారంలో ప్రాధాన్యతవుంది. మా సాంస్కృతిక, సంప్రదాయక, చారిత్రక చిహ్నాలన్నీ ఇండియాలోనే వున్నాయి. ఐతే ఇండియాలో మాకు ఇబ్బందులే లేవని కాదు. కొన్ని రాష్ట్రాలలో విద్యా, ఉద్యోగరంగాలలో మాకు ఇంకా కొన్ని సౌకర్యాలు కావలసి వున్నాయి. కాని, మొత్తం మీద ఇండియాలో మేము గౌరవంగా, సుఖంగా జీవిస్తున్నాం. ఈ దేశ రాజ్యాంగం కింద మా మత ధర్మాలు సంరక్షించ బడ్డాయి. ఇతర జీవిత రంగాలలో తక్కిన పౌరులందరి వలెనే మాకూ సమానావకాశాలు సమకూర్చ బడ్డాయి.

అందువల్ల పాకిస్తాన్ లోని ముస్లింల శ్రేయస్సుకు, ఇండియాలోని మా శ్రేయస్సుకు ఏమీ సంబంధం లేదు. ఇదీ కాశ్మీర్ పట్లపాకిస్తాన్ అవలంబిస్తున్న విధానం వల్లసృష్టిపడుతున్నది. కాశ్మీర్‌లో మెజారిటీ ప్రజలు ముస్లింలని, తన ఆర్థిక, రక్షక పరివృష్టికి అవసరమని—ఈ రెండు కారణాలుగా చూపుతూ కాశ్మీర్‌ను పాకిస్తాన్ కోరుతున్నది. ఈ కోరికను నెరవేర్చుకోడానికి కాశ్మీర్‌పైనీ ఇండియాపైనీ దండెత్తుతానని బెదిరిస్తున్నది. జెహాద్ మత యుద్ధం నినాదాలను చేస్తున్నది. ఈ సందర్భంలో హాస్యాస్పద మైన విషయం ఏమిటంటే—ఏ దేశం ముస్లింలను ఉద్ధరిస్తామని పాకిస్తాన్ అంటున్నదో ఆ దేశం ముస్లింలపైనేపడి 1947 అక్టోబరులో పాకిస్తాన్ దోచు కొన్నది. కిరాతక చర్యలను జరిపింది. హత్యలు చేసింది. స్త్రీలను అవ మానించింది. కాశ్మీర్‌లో కొద్దిమంది హిందువుల నిరంకుశత్వం నుంచి 30 లక్షల మంది ముస్లింలను రక్షిస్తానంటూ పదేపదే ప్రకటనలు చేస్తూ, క్రియలో ఆ ముస్లింలనే క్రూర హింసలపాలు చేసింది. అదంతా వారిని

ఉద్ధరించడం కోసమేనట. 30 లక్షల కాశ్మీర్ ముస్లింల కోసమని చెపుతూ 400 లక్షల ఇండియా ముస్లింల శ్రేయస్సును బలి పెట్టడానికి పాకిస్తాన్ కృత నిశ్చయమయింది: తోడి ముస్లింలంటే పాకిస్తాన్‌కు ఎంతటి ప్రేమో ఇందువల్ల స్పష్ట పడడం లేదా? కొద్ది మంది కాశ్మీర్ ముస్లింల కోసం పాకిస్తాన్ కాశ్మీర్‌పై దండెత్తితే, ఎప్పుడో ఒక్కప్పుడు ఆ కాసిని ఇండియా ముస్లింలపై హిందువులు తీర్చుకోరా? పాపం పాకిస్తాన్ లోని మా సోదర ముస్లింలకు ఇదేమీ తెలియదు; వారు తమ నాయకుల చేత మోసగించబడుతున్నారు. ఇండియాలో మాకు అటువంటి ఇబ్బందే తటస్థ పడితే తాను సహాయ పడగలనని పాకిస్తాన్ తలపోస్తున్నదా? కనీసం అట్టి సహాయానికి మేము అర్హులమని అయినా వూహిస్తుందా? ఎంత పిచ్చి తనం; 400 లక్షల మంది ముస్లింలు ఇండియానుంచి వలస పోతే పాకిస్తాన్‌లో వారికి నిలువ నీడ కూడ లభించదు. వీరికి ఒక్క పూట తిండి కూడా పాకిస్తాన్ పెట్టజాలదు. తన విధానాన్ని త్వరలోనే మార్చుకోక పోతే, ఎట్టి పరిస్థితి ఏర్పడ గూడదని అది ఆత్ర పడుతున్నదో అట్టి పరిస్థితే పాకిస్తాన్‌ను లోగాన గలదు.

ఇండియా మాకు అపకృతి తలపెట్టదని మేము పూర్తి విశ్వాసంతో వున్నాం. అలా తలపెట్టడం ఈ దేశం లోని రాజకీయోద్యమ మూల సిద్ధాంతాలకే విరుద్ధం. ఇండియా రాజ్యాంగ చట్టానికి, నెహ్రూ నాయకత్వ లక్షణానికి కూడ అది విరుద్ధం. అన్నిటికీ మించి ముస్లింల శ్రేయస్సుకు భంగం కలిగించే విధంగా ఇండియా ప్రవర్తించడమంటే అది పాకిస్తాన్ వలలో చిక్కు కోవడమన్న మాటే. పాకిస్తాన్ వాదంలో బలంగాని,

ధర్మం గాని మాకు కనిపించడం లేదు. మా కష్టాలను గురించి గాని, మా భవిష్యత్తును గురించి గాని పాకిస్తాన్ ఆలోచించడం లేదు. కాశ్మీర్‌ను గనక అది సంపాదించుకో గలిగితే, అందుకు ప్రతిగా మమ్ము దుస్సహ దాస్యంలో పాకిస్తాన్ పడద్రోయ గలదు.

ఈ విషయంలో కాశ్మీర్ ముస్లింలో ఏమి చెపుతారో విందా మన్న ఆలోచన కూడ పాకిస్తాన్‌కు లేదు. కాశ్మీర్‌లో ప్రజాస్వామిక ఉద్యమం వున్నది. ప్రక్కనే ఇండియాలో మత ప్రమేయం లేని ప్రజా స్వామి కోద్యమం వున్నది. స్వాభావికంగా ఈరెండు ఉద్యమాలకు మైత్రి కుదిరే అవకాశం వుంది. కాశ్మీర్ లోని ప్రజాస్వామిక నాయకత్వం ఇండియాలోని ఆదే విధమైన నాయకత్వంతో చేతులు కలపడం సహజం. ఆలా గాకపోతే 1947 లో పాకిస్తాన్ దుండగులు కాశ్మీర్‌పై విరుచుకు పడ్డప్పుడు సదరు ముస్లింలకు కాశ్మీర్ ముస్లింలు చేతులు చాచి స్వాగతం ఇచ్చేవారే. ‘ జేహాద్ ’ (మత యుద్ధం) అని మాటి మాటికి నినాదాలు చేయడంలో పాకిస్తాన్ వుద్దేశం ఇండియాలో మతోన్మాదాన్ని రెచ్చగొట్టడమే. ఇండియాలో మత కలహాలు చెలరేగడం పాకిస్తాన్‌కు లాభం. అప్పుడు వాటిని నిదర్శనంగా చూపి “ చూడండి ఇండియాలో ముస్లింలు ఎలా బాధపడుతున్నారో ; ఇండియాలో మీకు క్షేమం లేదు. పాకిస్తాన్ లోకి వచ్చెయ్యండి ” అని కాశ్మీర్ ముస్లింలకు చెప్ప వచ్చునని పాకిస్తాన్ వ్యూహం. పాకిస్తాన్ అవలంబిస్తున్న విధానం ఉభయ దేశాలకూ కూడా నష్టందాయకమే. ముఖ్యంగా ఇండియా ముస్లింలకు వినాశనకరం.

ఇండియాలోను, కాశ్మీర్‌లోను గల ముస్లిం ల హక్కులను రక్షించ డానికి కంకణం కట్టుకున్నానని పదే పదే ప్రకటించడానికి పాకిస్తాన్ విసుగు చెందడంలేదు. అయితే స్వరాజ్యంకోసం పోరాడుతున్న పఠా నులు ముస్లింలు కారా? వారి పట్లపాకిస్తాన్ ఎందు కంత కాఠిన్యం వహిస్తున్నది? ఇండియా జాతీయ కాంగ్రెస్ ఉద్యమంలో సహన సద్ధర్మా లలోను, ప్రజాస్వామిక సంప్రదాయాలలోను శిక్షణ పొందిన ఖాన్ అబ్దుల్ గఫూర్‌ఖాన్, డాక్టర్ ఖాన్ సాహెబ్ గార్ల నాయకత్వం కింద స్వతంత్ర ఫఖ్తూనిస్తాన్ కోసం పోరాడుతున్న స్వతంత్ర ప్రియులైన పఠానులను అమానుషమైన క్రూర దారుణ హింసలకు పాకిస్తాన్ గురి చేస్తున్నది వారంతా సోదర ముస్లింలు కారా? కాశ్మీర్‌లో నిష్పక్షపాతమైన ప్లెబి సైట్ జరగాలని కోరుతూ; పఠానులకు అట్టి అవకాశాన్ని నిరాకరిస్తున్న పాకిస్తాన్ విధానాన్ని ఏమనాలో;

మొత్తంమీద పాకిస్తాన్ అవలంబిస్తున్న విధానం, ముఖ్యంగా కాశ్మీర్‌విషయంలో దాని చర్యలు ఇండియాలోని మాకు ముస్లింలకు చెప్పరాని కష్టాలను తెచ్చి పెట్టగలవనడానికి సందేహంలేదు. నిశ్చింతగా, శాంతి భద్రతలతో, తోడి పౌరుల విశ్వాసాన్ని చూరగొంటూ, దేశ సౌ భాగ్యానికి వీలైన విధంగా, తోడ్పడుతూ, భయమనేదే లేకుండా మేము జీవించడానికి పాకిస్తాన్ విధానమే అడ్డుపడుతున్నది. దాని అవకతవ కతా అక్కడ తన ఆర్థిక విధానానికి, ఇక్కడ మా ఆర్థిక సంపత్తికీ గొడ్డలిపెట్లు అవుతున్నాయి. తాను మాకేమీ రక్షణ నివ్వలేకపోయినా, తనకు మేము స్వామి భక్తిని ప్రదర్శించాలని పాకిస్తాన్ కోరిక; తన

భక్తిపట్ల ప్రపత్తులు కలిగివుంటూ, ఇక్కడ మత ప్రమేయం లేని ప్రజాస్వామిక రాజ్యాంగంలో మేము పౌరస్వత్వాలను కలిగి సుఖంగా వుండాలనే పాకిస్తాన్ ఆశ; యుద్ధమే ఏర్పడితే అసలు తూర్పు పాకిస్తాన్‌లోని ముస్లింలను పాకిస్తాన్ రక్షించగలదా అనేది సందేహాస్పదం. పశ్చిమ పాకిస్తాన్‌లో గల 2½ కోట్లమంది ముస్లింలు మతిలేక ఆత్మహత్యాసదృశమైన యుద్ధానికి తలపడితే అందులో తూర్పు పాకిస్తాన్ ముస్లింలు, ఇండియా ముస్లింలు ఎందుకు బలి కావాలి?

కాగా, కాశ్మీర్ విషయంలో పాకిస్తాన్ అవలంబిస్తున్న విధానం ఇండియాలోని 400 లక్షల ముస్లింలకు ప్రాణాంతకం కాగలదని మేము మీకు నివేదిస్తున్నాం. శాంతిలోను, మానవ సౌభ్రాతృతలోను, అంతర్జాతీయ సద్భావంలోను భద్రతా సంఘానికి విశ్వాసం వుంటే ఈ మా హెచ్చరికను అది పెడచెవిని పెట్టదని, సమయం మించిపోకముందే ఈ విషయంలో చర్య తీసుకుంటుందని విశ్వసిస్తున్నాం.

ఇట్లు,

1. జకీర్ హుస్సేన్; పార్లమెంటు సభ్యుడు, అలిఘర్ ముస్లిం యూనివర్శిటి వైస్ ఛాన్సలర్, ఢిల్లీలోని జమియ మిల్లియకు ఇదివరలో వైస్ ఛాన్సలర్.
2. సర్ సుల్తాన్ అహమద్; ఇదివరలో గవర్నర్ జనరల్ కార్యవర్గంలో సభ్యుడు.
3. అహమద్ సయ్యద్ ఖాన్; ఛటారి నవాబు, ఇదివరలో సంయుక్త రాష్ట్రాల ఆక్టింగ్ గవర్నర్, హైదరాబాదు ప్రధాని.

4. సర్ మహమ్మద్ ఉస్మాన్; ఇదివరలో గవర్నర్ జనరల్ కార్య వర్గ సభ్యుడు,• మద్రాసు ఆక్టింగ్ గవర్నర్, మద్రాసు యూని వర్సిటీ వైస్ ఛాన్సలర్.

5. సర్ ఇక్బాల్ అహమ్మద్; ఇదివరలో అహమ్మదాబాదు హైకోర్టు జడ్జి.

6. సర్ ఫజల్ రహీంతులా; బొంబాయి షెరీఫ్.

7. మౌలానా హిఫ్‌జుల్ రహ్మాన్; పార్లమెంటు సభ్యుడు, అంజిమాన్–ఇ–జమైత్–ఉల్–ఉలేమా సంస్థ కార్యదర్శి.

8. నవాబ్ జైన్ య్యార్ జంగ్; హైదరాబాదు పబ్లిక్ వర్క్సు శాఖ మంత్రి.

9. ఎ. ఎమ్. ఖ్వాజా; ముస్లిం మజ్లీస్ సంస్థ మాజీ అధ్యక్షుడు.

10. డి. ఎం. జరీఫ్; పశ్చిమ బెంగాల్‌లోని దాఫీచోప్రా ముస్లిం సంఘ కార్యదర్శి.

11. హెచ్. క్వమూర్ ఫెరూకీ; హైదరాబాదు జమైత్ ఉల్ ఉలామా అధ్యక్షుడు.

12. ఎమ్. ఏ. కజ్మీ; లడ్వకేటు, పార్లమెంటు సభ్యుడు.

13. హఫీమ్ ప్రేంజీ; లోగడ బొంబాయి షెరీఫ్.

14. కలనెల్ బి. హెచ్; జైదీ పార్లమెంటు సభ్యుడు, పూర్వం రాంపూర్ ప్రధాని.

స ం పూ ర్ణ ము .